# బృందావనము

(ఖండ కావ్యము)



శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు



పబ్లిషర్సు:
ఎ. వి. రాం అండ్ కో., నర్సాపురం.

హోల్ సెల్లింగు ఏజంట్సు:
ప్రభాత్ అండ్ కో., పాలకొల్లు, బెజవాడ.
బుక్ సెల్లర్సు అండ్ స్టేషనర్సు

వెల రు. 1—0—0

# బృందావనము

(ఖండ కావ్యము)

శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు

(అన్ని కావ్యాలు గ్రంథకర్తగారివి)

పబ్లిషర్సు:

ఏ. వి. రాం అండ్ కో., నర్సాపురం.

సోల్ సెల్లింగు ఏజంట్సు:

ప్రభాత్ అండ్ కో., పాలకొల్లు, బెజవాడ.

బుక్ సెల్లర్సు అండ్ స్టేషనర్సు.

వెల రు. 1—0—0

# పీఠిక

శ్లో॥ శ్రీమత్సుధార్ణవే రత్నద్వీపే మాణిక్యమందిరే
రత్నసింహాసనాసీనాం హృదికామేశ్వరీం భజే.

మత్ప్రేయోభిలాషులకోరిక పైని బృందావనమను పేరట
నావిరచితములనుండి కొన్ని గుచ్ఛములకూర్చియున్నాను. ఇందు
"ప్రణయలీల"లో కొందటి పద్యముల తుది ద్విపదలో నొక
కొంచెమును మాత్రము "రుబాయతు" లోని భావముల
పత్రికాదుల ననుసరించి వ్రాయబడినవి చాటువులు. అక్క
డక్కడ కొన్ని పదములు జనులవాడుకనుబట్టి ప్రయోగింప
బడినవి.

ఇట్లు
తిరుపతివేంకటేశ్వర శిష్యపరమాణువు
మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి

శ్రీవేంకటేశ్వరాయ నమః

## బ్రహ్మశ్రీ గోవిందరాజు వేంకటసుబ్బారావుగారం

దీర్ఘాయురారోగ్యైశ్వర్యశాంతిపథముల నిరచయిత
కును తత్సంతానమునకును ప్రసాదించుటకునై మత్స్వామి
వేంకటేశ్వరుని పాదములకు నివాళించుచున్నాను.

గోవిందరాజు వేంకటసుబ్బారావు

# అభిప్రాయములు

శ్రీమత్పరదేవతాయై నమః.

కడియము
తూ. గో. జి.
20—11—37.

## బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

### బృందావనము

అనెడి యీఖండకావ్యములసంపుటము బి. మాధవ రెడ్డి బుచ్చిసుందరరామయ్యచే రచింపఁబడినది. ఇతఁడు సుమారు ఇరువదియైదేండ్లకు పూర్వము నాయొద్ద కొన్నాళ్లు మాఘకావ్యమును కౌముదియుఁజదువుకొనుటకు వచ్చినాఁడు. మాదంపతులయందు కేవలము కన్నతల్లిదండ్రులకన్నను అధిక భక్తిగానుండి చదివికొన్నాఁడు. కాని అతనికితోఁచినట్లు చదువుటయేకాని నాయేర్పాటునుబట్టి చదువువాఁడుకాఁడు. ఇతనికప్పటికే తెలుఁగులో మంచి కవితాధారయుండెడిది. ఎట్లో కొంత కౌముదియు మాఘములో కొంతవఱకును నేర్చినాఁడు. ఇతని చదువు గానముతో మిళితముగ నేయుండును గాని నాకు రేగుప్తివలెనే యితనికి నాదనామక్రియ అనెడి రాగము మీఁద నభిమానమెక్కువ. ఆకారణమువలన నాకు శిష్యుఁడై కూడ నాచదువుధోరణి యితరశిష్యులతోపాటుగా నితఁడనుకరించువాఁడుకాఁడు. ఇతనిచదువుఫక్కి మిక్కిలి శ్రావ్యముగానుండును. కవిత్వము కేవలము క్రొత్తపోకడలతో నెంతో

పద్యముగానుండును. ఒకరిద్దరోవరకు బొత్తిగా లేఖిని నడువని
వాఁడుకలచే నీతనికవితకు గ్రంథచౌర్యదోషము లేకముండు
తగులదు. ప్రస్తుతమాంధ్రభాషలోఁజేరి వాడఁబడుచున్న నానా
భాషాపదము లితనికవిత్వములో నెన్నో యుండును. పూర్వ
కవులందఱును వారివారికాలమునకు వాడుకలోనున్న ఆయా
యితరభాషాపదములను అంతో యింతో గ్రహించినవారే. ఈ
పుస్తకము విద్యార్థులకు పఠనీయముగా విద్యాశాఖాధికారులు
తప్పక గైకొందురని నాదృఢవిశ్వాసము. ఒకరిశిఫారసుతో దీని
కవసరముండదు. ఈకవిత్వపారవశ్యమట్టిది. తన్మయత్వమునసర్వత్ర
కవిత స్ఫురించుచుండును. భగవంతుఁడీతనికిఁజిరాయురారోగ్యై
శ్వర్యములననుగ్రహించునట్లు లాశీర్వదించుచుదీనినిముగింతును.

చెళ్లపిళ్ళ వేంకటశాస్త్రి
శతావధాని.

శ్రీరస్తు

శ్రీమన్మహా మహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిసార్వభౌమ
ఆంధ్రవ్యాస అభినవ శ్రీనాథాది బిరుదాంకితులగు
బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు రచిం
చిన "బృందావన"మను ఖండకావ్యములోఁ గొన్నిపద్యములు
కవిగారే శ్రావ్యముగాఁజదివి వినిపించినారు. నాకాపద్యములు
హృద్యములై శ్రవణానందము గలిగించినవి. చక్కని మృదు
పదములతో మధురమధురముగా నాపద్యములు చెవులంబడి
యెట్టివారి మనంబులనైన గఱఁగింపఁగలవని నానమ్మకము.

"ఆలోచనామృత"మను నా నుడివ్రడనాడి "ఆపాతమధుర" మను గీతార్థమును బొందుచున్నవని త్రికరణశుద్ధిగాఁ జెప్పఁ గలను. ఇప్పటివారు వ్రాయు ఖండకావ్యములకన్న వీరి యీ ఖండకావ్యము వేయిపట్లతిశయించుచున్నదని నా యభిప్రా యము. వీరు చిరాయురారోగ్యములుగలిగి యిట్టి వెన్నో కావ్యములువ్రాసి లోకము నానందింపఁజేయుదురుగాక యని పరమేశ్వరుని బ్రార్థించుచున్నాను.

రాజమండ్రి,
20—11—37.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

## చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు

శ్రీ వేదమూర్తులైన బ్రహ్మశ్రీ మాధవపెద్ది బుచ్చిసుందర రామశాస్త్రిగారు రచించిన "శారద, సతీస్మృతి" మొదలగు గ్రంథములలో పద్యములను మఱికొన్నిచాటు ధారాపద్యము లను నేటియుదయమున వారు చదువగ విని పరమానందము నొందితిని. కవనము ద్రాక్షాపాకమై ధారాశుద్ధిగల్గి ప్రసాద గుణముగల్గి హృదయంగమముగనున్నది. ప్రతిపద్యము రసా స్పదము. ప్రతిభావము గంభీరము. ప్రతికల్పనము మనోహ రము. పరమేశ్వరుడు వీరికి దీర్ఘాయురారోగ్యములిచ్చి సార స్వతసేవ చేయించుగాక !

రాజమహేంద్రవరము,
21—11—37.

చిలకమర్తి లక్ష్మీనరసింహము

శ్రీ పరదేవతాయై నమః

# బృందావనము

## ప్రార్థనము

మ. పరిమాణింప నశక్యమైనది భవత్ప్రాబల్య మీవిశ్వగో
చరమే కాని నమోఘమైనది భవత్సంకల్పముల్, ప్రేమలోఁ
బరమస్థాన మలంకరించినది నీసత్యస్వరూపంబు, మే
మెఱుఁగంజాలుదుమే! భవన్మహిమ తండ్రీ, ఆర్తరక్షామణీ!

మ. అదిగో! అప్పటియాదికాలమున నీవానానిరాజ్యాండలీ
హృదయస్థానమలంకరించి ప్రతితంత్రీసూక్ష్మమూర్ఛాంబుపూర్ణ
గదలన్ మాటి గాంధర్వనాదమట వీణాబ్రహ్మగానంబు మా
కెదియోదీ యొకసారి మావఁగదె తండ్రీ, దానిమాధుర్యమున్.

శా. ఆ వీణాస్వరమాధురిం దవిలి దివ్యాబ్దంబు లెన్నేని యా
మావిశ్వంబు సమస్తమున్ మఱచి యుండె లీనులైనట్లు మా
కేవేదంబు వచింప నయ్యదియు నీవే కావె, ఏలయ్య మా
కీవా భాగ్యము నారదప్రక్రైనవారే! మేము కామైతిమే!

మ. తనయుచ్ఛ్వాసమె హంసలాగు హృదయస్థానంబునన్
నిల్పి యు
ల్లన జోకొట్టుచు నిద్రఁబుచ్చునటు లాలాపించు సంగీతని
స్వనమాధుర్యము గ్రోలి కేవలము జీవన్ముక్తుడై పోక యొం
దునకో మానవుడార కేఁగదవుచుండున్ గాలమాత్మేశ్వరా!

మ. నరుఁడో! క్రాంత మనంబుఁ బిల్చి తనకంటన్ జూపకున్ మధ్య ని
వ్వరిముల్లంతట సూక్ష్మరంధ్రమున నాత్మజ్యోతికై
యున్న నిన్
బరమాత్మున్ గనలేక శుక్తిరజతభ్రాంతిప్రవిష్టాత్ముఁడై
యురకే గ్రంథము గ్రంథమున్ దిరుగవేయున్ దండ్రి
విశ్వేశ్వరా!

మ. నిరహంకారము, నిర్మమత్వగుణము, తండ్రీ, నిత్యానిముక్తి కా
చరణస్ఫూర్తియు, శాంతి దాంతియు, యదృచ్ఛాలాభ
సంతుష్టి, నీ
చరణధ్యాన సమాధు, లన్నవె కదా! 'సత్యం శివం సుందరం
పరమం' బైన భవత్పదంబునకు సోపానంబు లాత్మేశ్వరా!

తనయందుండినయట్టి యష్టదళపద్మం బష్టభార్యాసమా
హాముగా నిన్ బరమాత్మఁ గృష్ణునిగ దేహద్వారకన్ నారదా
ది మహర్షుల్ మును నిర్వికల్పకసమాధిన్ గేళిగావించి ని
త్యమునుం జెందరె యద్వితీయమగునాత్మానందమాత్మేశ్వరా!

మ. నిరతంబున్ దనలోపలం గలత్రివేణీ సంగమంబందునం
బరమస్నానమొనర్చి భక్తి మదిరాపానంబు గావించి యాం
తరహంసాత్మకమైన నీప్రణవనాద బ్రహ్మముం జెంది, మా
యురె, మా నారదుఁ డెంత ముగ్ధుఁ డయినాఁడో నాఁడు
విశ్వేశ్వరా!

మ. కలకాలంబును కాపురంబునకు సౌఖ్యస్వర్గ మాహార మ
ష్టలితానందరసంబు, క్రమ్మఱఁ జిదాకాశం బధిష్ఠింపఁ గుం

పతిసిచక్రసువర్ణపుష్పకవిమానం బెంత ధన్యాత్ములో !
అల యింద్రాదిసురల్ మహామహులు నీ యాత్మీయు
లాత్మేశ్వరా !

తే. గీ. వచ్చి యొకసారి నా ప్రాణవాయువునను
హృదయవేణువు నూదిపోయెదవె కృష్ణ !
ఆత్మబృందావనంబు నీయాగమమున
కెదురెదురు చూచుచున్నదోయీ, మహాత్మ !

తే. గీ. యమునయే గాక దేహప్రయాగయందు
గంగయు సరస్వతియుఁ గూడఁ గలవుగాన
నా త్రివేణి జలక్రీడ నాచరింతె ?
నాడికారూప గోపీజనంబు గూడి.

తే. గీ. బాలకృష్ణుఁడవై నాదు ప్రకృతి శ్రుతిని
వేణుగానంబు నేకీభవింపఁజేయు
మనుసరించు మృదంగ మన్నటు త్రివేణి
ఘుమఘుమార్భటి శబ్దంబు గొలుపుకొనుచు.

---

'శారద' నుండి

## శారద వనవిహారము

అదిరొకపూలతోఁట సమయంబరుణోదయమల్లమల్లెపూఁ
బొదకడఁ బైడిగుమ్మటము పోల్కి నిలంబడి యల్లనల్లనన్
గదలుచుఁ బువ్వుపువ్వు కవగాలికి మోహననృత్యమాడు నా
హృదమునుగాంచుకన్నదెస వేయుదమించుక సేపుచూపులన్.

చ. అదిగో! లతావితానముల కానలఁ గప్పని పూఁతపిందెలన్
విరిసెడి మాలతీవిరి గమింపుము నాకొలతాంగి రావె శా
రద యని పిల్చినంత మనరాజనిభానన వచ్చుచుంటి నే
నిదె యని పాగెడున్ మనము నేఁడు మహోదయున్ మనో
గతిన్.

చ. అలఁతిగ వంచి కేఁతనదు మంటియునంటనిరిశిఁ గోమలాం
గ్రముల నిలమాపుచున్ నదము క్రొత్తయొయ్యారముతోడఁ
బూపుడీ
వల ఫలవృక్షవాటికలపైనఁ గటాక్షసుధాతుషారమున్
జలికెడు కన్నెచిన్నె దరిసించినఁ గన్నులపండువయ్యెడిన్.

మ. అలసాలోలసమీరలాలనల విన్పారంగనున్నట్టి మొ
గ్గలతం దీయని తేనెబుగ్గలకు భృంగశ్రేణు లుత్కంఠతోఁ
గొలువుల్ దీర్చు లతాగృహంబునఁ జతుష్కోణాకృతిన్ వన్నెవ
న్నెలరాల్ మల్చి యమర్చినట్టి యొకతిన్నెన్ వారలాసీనలై.

చ. సురభిళమందమారుతకిశోరచరిత వనీలతాగృహాం
తర నవపల్లవస్థగిత ధాళధళీకశిలావితర్దికా
పరిసరనిస్వన ప్రియమధుబంధురకోకిలకీరశారికా
స్వర మధురామృతశ్రవణపారణసౌఖ్యరసైకలోలలై.

చ. పొడమెడు మొల్కలం గుఱిచి పూచెడు వృక్షములన్
గుఱించి ప్రా
కెడు పలుతీవ క్రొన్ననలఁ గెంజవురాకుల గూర్చి ముచ్చటల్
నడిపిన మీఁదఁ గన్నెవదనంబునఁ జూడ్కి నిగుడ్చి యొదిమో
నుడువగనుండె వింద మలనూత్నవధూమణివాక్యధోరణిన్.

శారద పద్యవిహారము శ్రీ వేమన

చ. సిరిగలయింటఁబుట్టి కవితావిభవంబు గడించి వేంగి సత్కవుల్
మెఱుఁగనిరీతి వర్ధిలు పద్యములు గాశ్చ్యపేశ విద్యసుం
దరతరమైన యీయుపవనంబు నన్గూడ ననుగ్రహించవే ని
శ్వయము, సహోదరీ, పాగడశక్యమె, నాని దయా
ప్రపూర్ణతన్ !

తే. గీ. సంస్కృతాంధ్రంబులను పరిశ్రమ మొకింత
సలిపియుంటివి గద ముఖస్థంబు లగునె
దైవపరమైనయట్టి పద్యము లె వేని
చదివెదే శారదా ! రాగసరణి ననఁగ.

తే. గీ. చిఱునగవు వెన్నెలను మోవి చిమ్ముచు నుంత
మిలమిలయనంగఁ గంఠంబు మేళవించి
ప్రకృతి యను శ్రుతి సంసిద్ధపడెఁ బఠింపఁ
గిమ్మనకయుండి మన మాలకించవలయు.

శా. భక్తత్రాణపరాయణాయ భవతాపఘ్నాయ వేదత్రయీ
ముక్తాహారవిభూషితాయ కరుణాపూర్ణస్వరూపాయ దు
ర్వ్యక్తిచ్ఛేదక తారకప్రణవపీఠారూఢతాభోగ సం
యుక్తాధ్యాత్మికరాజ్యపాలనమహోద్యోగాయ
తుభ్యం నమః.

మ. పరిశుద్ధంబయి యద్వితీయమయి సర్వవ్యాప్తమై నిత్యమై
నిరవద్యంబయి నిర్వికారమయి మానిత్రాతచేతస్సరో
వరహంసంబయి కోటికోట్యరుణభాస్వద్దీప్తిధారావళీ
పరిపూర్ణంబు మహామహంబగు పరబ్రహ్మంబు మమ్మేలుతన్.

మ. యదుసింహంబు యశోదపట్టి నవనీతాహారి కంసారి కెం
పెదవిన్ పిల్లనగ్రోవిఁ జేర్చి తులసీబృందావనక్షోణిలో
మృదుగీతామృతవర్షముం గురియు నా శ్రీకృష్ణ మేఘంబు నా
హృదయాకాశము గ్రమ్మి శోక బహుళ గ్రీష్మాతపం బార్పుతన్

మ. కరుణాబ్ధీ ! హృదయాబ్జపీఠమున నీకల్యాణరూపంబు సు
స్థిరముం జేసి తరింపగా నొకశుభాశీర్వాద మాసించి నీ
చరణప్రాంతమునన్ శిరంబునిచి తృష్ణావ్యాకులత్వంబులన్
బరిఘోషించెద నెట్లుతప్పుకొనిపోవన్ నేర్తువో చూచెదన్!

మ. శ్రమలెన్నో విఫలంబులై చనియెనో స్వామీ !
మదీయ ప్రయ
త్నములెల్లన్ ఫలియింపలేదు, జగదంతర్యామి! యీయొక్క జ
న్మమునం దీనరమాత్రజీవనములోనన్ మాటికిన్ సంభ్రమ
భ్రమలం గొల్పెడు నీరహస్యస్పృహాల పూర్ణత్వంబు సిద్ధించునే!

మ. నిరతంబున్ జరనూతనుండవయి తండ్రీ! నీయెడన్ భక్తిబం
ధురులౌవారి హృదంతరాళములయందున్ నూత్న
నూత్నంబుగాఁ
బరగన్ జేసి స్వయంప్రకాశత లయింపన్ జేసి యవ్వారలన్
మరలన్ సృష్టియొనర్చువే! తిరిగి సంహారంబు గావింపఁగన్.

తెలుపన్ నేర్తునె యొక్క-జీవనమునందే నన్ను నీవెన్నిమా
ఱులు సృష్టించి లయింపఁ జేసితివొ కారుణ్యాంబుధీ!యింకఁ గా
వలెనన్నన్ మఱియున్ మఱిన్ మఱి లయింపం జేసి సృష్టించి కే
ళులమున్ నీకనుసన్నలన్ మెలఁగు శేవన్ దిద్దుకొమ్మా ప్రభూ!

శారద వనవిహారము

మ. సిరులున్ లేములు కష్టముల్ సుఖములున్ చింతల్
మహోత్సాహముల్
మరణంబుల్ జననంబులన్నియును యుష్మన్మంగళో
ద్దేశమున్
నెఱవేర్పందగు సాధనంబులని మానింబోలి భావించు నే
పురుషుం డాతఁడె బంధముక్తుఁడు స్వయంభూ! నిర్వికార
ప్రభూ!

మ. పరిపాలించుచునుందు వెల్లపుడు యావద్విశ్వమీ విశ్వ ము
త్తరపు వ్యాపారరీతిఁ జెల్లెడి మహాత్మా! ఏ శుభోద్దేశ ము
త్తెఱఁగో మేము గ్రహింపఁజాలక మహార్తిన్
గ్రుంగుచున్నాము త
త్పరమార్థగ్రహణైకపాటవము మాకిమ్మమీ! కటాక్షింపుమీ!

సీ. పసిపాపయగు వాని పాలబుగ్గలపైని
నివ్వటిల్లెడు మొలకనవ్వుకన్న
అరుణోదయమున విప్పారి తుమ్మెద కాలు
మోపకుండిన తమ్మిపూవుకన్న
ఉపఘాతినెంచు నోరుగాలికినేని
కలఁగని మణిదీపకలికకన్న
ఆకైన నుంత యల్లాడకుండు నిశీథ
సమయమందలి సరోజలముకన్న

తే. గీ. నిర్మలముఁ గోమలంబును నిశ్చలంబు
శాంతిమయమైన యట్టి సుస్వాంతపీఠి

సమరసీమఁ బ్రకాశమునియ్యవె యమేయ!
అద్వయ! అనంత! ఆదిమధ్యాంతరహిత!

తే. గీ. ఇపుడు మనమున్న యీలతాగృహసమీప
కదళికలమధ్యమున్న దల్లదిగో! చూడు,
శిల్పనైపుణితో నింతచెలువుతోడ
సత్తిసాఫల్యముఁ జూడ నలరు నేఁడ.

తే. గీ. ప్రాచ్యపాశ్చాత్యరచనల బహువర్ణ
సంకలనసామరస్యవిస్తరమనోజ్ఞ
కాంతిపూరంబుతోడ నాకాశవీధి
కెటుల నెదురెక్కెనో కంటివే! గృహంబు.

తే. గీ. తాదృశంబగు దివ్యసౌధంబునందు
సనుఁగుఁ బ్రేయసితో జీవయాత్ర నడపు
హాయిగా నొక్కరసభోగి యుగ్రవర్ణ
నందనోద్యానభాగమందారశాఖి.

తే. గీ. పరులకన నొకదివ్యమందిరముగాని
యాతనికి భూతలస్వర్గ మాగృహంబు
మదిగణించెడు ప్రియసతీమధుర మధుర
సరససల్లాపవచముల ప్రసక్తికతన.

తే. గీ. వయసునలువదికొకవాసి, వాసి నేటి
తెలుఁగునాటకఁ దళుకుము త్రెంపుఁ జేయు,
పేరు రఘునాథశాస్త్రి, తత్ప్రియతనూజ
లిచటిదిక్కారిపోక్కారియుగము కొండ్లు.

చ. లలితసరోజరాజసమలంకృతగాంగఝరీదరీదరీ
మకలహారిధురీణ ఘనమానసకిశోరవికీర్యమాణ త
జ్జలకణరేఖికాగ్రహణ సౌఖ్యరసాస్పద వాక్యచాతురీ
విలసితుఁడంచుఁ బండితులు వేయివిధంబుల మెత్తురాతనిన్.

మ. అతిగంభీరమనస్వి, దేశహితచర్యాభ్యాసి, మహాంధ్రసం
స్కృతసాహిత్యజ్ఞుఁడు, సవ్యభారతవిపంచీ లోకకల్యాణభా
షితతంత్రీ పరిముక్తసార్వజనికస్వచ్ఛాదరాహ్లాది, త
త్ప్రతిసంపన్నగృహస్థుతత్త్వవిత్స్వతంత్రవ్యక్తి లేఁడెందులన్.

సీ. సతికి నాతఁడు సజ్జ నాథప్రాణుల సెజ్జ
అతిథికోటికిఁ దృప్తి యమృతవృష్టి
సభకు నాతఁ డొసఁగు వన్నె చందనవన్నె
శ్రోతకోటికి మాట సూటిబాట
నిఖిలపేదపాలి పెన్నిధి వాని సన్నిధి
వాసికెందిన యువ్వానియాడి
అనుయాయులకు వానియండ బంగరుకొండ
కలబంధులకు వాని కలిమి బలిమి
తే. గీ. సదుపమస్నేహవాత్సల్యనిశ్చలత్వ
జీవకారుణ్యలావణ్యచిహ్నములకు
నతని వదనంబు సదనంబు సతత మతని
పూర్వభవసంచితాగణ్యపుణ్యమేమొ !

'శారద' నుండి

## శారదాకృష్ణుల అనురాగము

సీ. కమలనా మేడ రెండవమెట్టునను నిల్చి
లక్ష్మియు నాతపలక్ష్మియనఁగ
చలియలోపలినుండి తెరలించుకొని పైకి
పొరలెడు నెలమేటి పొంగనంగ
అతికాంతమ్మైన జీవితకుసుమం దెలిసో
వని యొకానొక సుఖస్వప్నమనఁగ
అరయుచున్నకొలంది నతిశయిల్లుచుకాని
కడపూర్ణదని మహాకాంక్షయనఁగ

తే. గీ. కనులు మిఱుమిట్లుగొలుపుచు కడుఁబ్రసన్న
మగుచు 'మననీయము' మనోహరమునైన
తన సఖి యౌవనవ్పుఁ దళ్తుకనలెందు
కనుచుఁగనుచును మోహముగ్ధతవహించు.

సీ. కడుఁ జిన్నిపువ్వురాగపుఁ గట్టడపుదిద్దు
లన్ వ్రేలు రవలలోలకులతోడ
నెమలిపింఛంబువన్నియ పచ్చపొదిగిన
కడవ్రేల ముద్దుటుంగరముతోడ
ఎదనడఁగెంపు తెల్లదనంబ్రసిలంపు
మణు లమర్చిన కంఠమాలతోడ
చిఱుతగజ్జెల మ్రోతఁ జెవికిఁబండువొసఁగు
మేలిబంగరు మొలనూలితోడ

తే. గీ. జాజిపూఁదీగెగాజుల జతలతోడ
రకరకప్పుఁ జీనిచీనాంబరములతోడ
ముగ్ధమోహనలావణ్యమూర్తితోడఁ
జేజరిలు వానిసతి రతిదేవిజాడ.

తే. గీ. కలకలన్ నవ్వునటులుండు కన్నుతత్తి
నిష్కలుషితాంతరంగంబు నీడఁజూపు
మోహనపవిత్రశీతలజ్యోతిఁ బఱపి
పాతకినైన నామె 'పునీతుఁ'జేయు.

తే. గీ. పలుకుపలుకునఁ బూఁదేనె చిలుకుమోవిఁ
బలువరుస ముత్తెములకాంతిఁ బడిలపఱచి
తనప్రియుఁడు గన్నులం గప్పికొనఁగ నామె
ముచ్చటలనాడు ముద్దులుమూటగట్టు.

తే. గీ. అడుగిడినయప్పుడెల్ల జవ్వాడుచుండఁ
బిడికిట నడంగియడగని పేదనడుము
విభునికడ కామె యరుదెంచి వెడలుపోయుల
కనుచెపో కంటిలోఁ బాద గలఘలమ్ము.

తే. గీ. కొనమరాయంచనడలోని కులుకు, కన్నె
తల! నడలోని నిండునిబ్బరపుటొఱపు,
నవ్వునడలోనితీవి, యవ్వప్పుకోడి
కదలినప్పుడెల్ల మనకు సాక్షాత్కరించు.

తే. గీ. సజలజలధరకోమలశ్యామసుంద
రంబులై మోముపై వ్రాలి రవ్వగాలిఁ

చిఱునగవ్వుతోడఁ బతిమోము తెలుఁగుగనుచు
నాకొక్కరపుడామె నర్మగర్భితములాడు.

తే. గీ. వలువపావడదాల్చి, యీ నరిగపూల
రైకధరియింపుమనియుందురా? యటంచు
నడిగి, పతిమోవిగదలింపునంత నామె
దప్పునకు నేగి మూసిముసి నవ్వునవ్వు.

తే. గీ. తీసి నగలెల్ల మొయిదాయ తెల్లపట్టు
చీరకుఁ జ మేల్మిబంగారు నీలిమోయ
విభునితో నామె యమునవసి వీధులందు
దిరుగునొయ్యారమును జూచితీరవలయు.

తే. గీ. పొదుపుబెండను బతినిల్వ పొంతనిల్చి
కురులతో నింద్రనీలాలగొడుగుపట్టి
మధురమధురంపుటూర్పుచామరమువిచి
నవ్యలావణ్యనీరాజనం బొనర్చు.

తే. గీ. చెంతఁబొంచున్న పతిరూపు చేతనున్న
గిలుకుటద్దంబునం దిలకించి యామె
చిఱునగవుతోడినునుసిగ్గుచేత గునియు
నామనోహరదృశ్య మెంతైనఁ జేయు.

తే. గీ. మొలక నవ్వు మోవి నాట్యంబు నలుపునపుఁ
దిదుమఁజొల్లాడు ప్రియురాలి చెక్కులందుఁ
జొదకుచిఱుగుంటలను వ్రేళ్ళమొనలనొక్క-
యూపునాలఁదు శృంగార ముట్టిపడఁగ.

తే. గీ. తనయులఁదియూపువులు మోముదమ్మి గ్రమ్మి
వలపు లూరింపగా సమీపమున నిల్చి
చివురుఁ గెంగేలఁబట్టి గోక్షీరపాత్ర
పెదవికందిచ్చెఁ బతికిఁ బ్రత్యూదయ మాపు.

తే. గీ. నిలువుటద్దంబులోఁ దననీడఁ జూడఁ
జిత్రమే లేనియటులుండి, చివి తేకు
వెనకనున్నటిలోఁ దననీడఁ జూచు
నాడలు సర్వంబు గన్నాతె యున్నయట్లు.

సీ. కలకలా నవ్వు కన్నులు కన్నులం బెట్టి
లీల బావాలఁ గంతకాలఁ జేయు
మిలమిలా మెఱయు చెక్కిలి చెక్కిలికిఁ జేర్చి
పట్టి చేతిని మెడచుట్టుఁ బాచు
గలగలా మెఱయుతళుకుల బెళుకులం బాల్చి
కొసరిమాటికి గుజగుజలు వోవ
జిలజిలా దేనె చిప్పిలు మోవి మోవిపై
నిలిపి నిల్పిన మోహనిద్రఁ బుచ్చు

తే. గీ. పాడిపాడి కరాలిపోవు మైపూఁతతోడ
వడివడిగఁ బర్వు నిట్టూర్పు వలపుతోడఁ
జిఱుచెమటతోడఁ జతికిన శిరము వ్రాల్చి
వెనకనున్నది చలువపన్నీరు రాల్చు.

తే. గీ. పాలనీటిగులాబి లేఁబైరగాలి
నించుక చలించునట్లు చిట్టించి మోము,

శితకటాక్షంబులఁ బికజిమ్మ యూహ
జోలయుబికనేని వలిని భవిష్యూహపథము.

సీ. అలిగెడువేళ కాలాహియాకాదల ధగ
ద్ధగఁ బ్రజ్వలించురత్నంబులగుచు
కనలెడివేళ మేఘచ్ఛన్నమైన నీట
మిండిండు సాంధ్యరాగంబులగుచు
నవ్వెడివేళ నానందలీలాతరం
గారూఢమగు రాజహంసలగుచు
శ్రమఁజెందువేళ సుశ్యామలాభ్రముల మ
ధ్యగఁ దేలి గొడుతారలగుచు

తే. గీ. సరసమాడెడు నడ నీలజలతరంగ
సంచలచ్చంద్రకాంచలాంచలములగుచు
మాటిమాటికి నామెచ్చుజ్యోదలముల
వెడలి జ్యోతిఃప్రభలు వెల్లివిరియుచుండు.

సీ. పండినకమ్మసంపంగిరేకులవంటి
మ్రుగ లాంగుళులు నాకెఁ గదలుచుండ
పాలఁజెక్కరవోలెఁ బంచమస్రుతిలీన
మగుకంఠ మధురిమ వ్యంబుగాఁగ
కృతులయందోడుగుసంగతులు తీగలనుండి
జలజలరాలుపువ్వులఁబోల
శృంగారవన చైత్రశ్రీవానిలములట్లు
వలపించుమధురభావములు వొదల

శితకటాక్షంబులఁ బిరజిమ్ము రూపు
బాలయువికనేని పతిని బ్రహ్మానందమును.

సీ. అలిగెడువేళ కాలాహిపూదల ధగ
ద్ధగఁ బ్రజ్వలించురత్నంబులగుచు
కనలెడివేళ మేఘచ్ఛన్నమై నీట
బింబించు సాంధ్యరాగంబులగుచు
నవ్వెడివేళ నానందలీలాతరం
గారూఢమగు రాజహంసలగుచు
శ్రమఁజెందువేళ సుశ్యామలాభ్రముల ను
ద్వగఁ దేలి సౌదామినీతారలగుచు

తే. గీ. సరసమాడెడునెడ నీలజలతరంగ
సంచలచ్చంద్రకాంచలాంచలములగుచు
మాటికొకసారి నామెచ్ఛబృందములను
వెడలి జ్యోతిఃప్రభలు వెల్లివిరియుచుండు.

సీ. పండినకమ్మసంపంగి తేకులవంటి
సృగలాంగుళులు సారెఁ గదలుచుండ
పాలఁజక్కెరవోలెఁ బంచమశ్రుతిలీన
మధురకంఠ మధుతరవద్యంబుగాఁగ
కృతులయందొదుగుసంగతులు తీగలనుండి
జలజలరాలుపువ్వులఁబోల
శృంగారవనచైత్రకేళానిలములట్లు
నలపించుమధురభావములు పొదల

తే. గీ. దివ్యరమణీయ వివిధభంగికల నాను
గురియు గానామృతంబును గ్రోలి క్రోలి
మొంపకేళియు నాతఁ డొక్కింత యొనఁ
దనివి జెందఁడు తృషితచాతకమురీతి.

చ. చిగిరించియున్న దేవో వికసించినదేవో మొలుంగ రాక జం
టగఁ బెనవైచి తేఁటిభ్రమరాంగన తృప్తి గాన మేకహో
ళిగ నొకదానిపైఁ బ్రకటనలించఁగఁ జేయుచు నొక్కఁడెంతో ము
ద్దగు మరుదీప్తులుం గొని చెంచిరి వాకలొప్పఁగన్.

సీ. జీవితోద్యానసంస్థితదృఢస్నేహంపుఁ
దీవ పూచినయట్టి పూవులనఁగ
దాంపత్యసుఖసముద్రమున నాందోళితో
నారసి యుయ్యేలలూగు తరగలనఁగ
శృంగారవిపిఁ జిత్రచిత్రభావపుఁ బల్లె
టీలు వైచెడు పావురాలనంగ
విశ్వసంతోషచంద్రికను స్వేచ్ఛావిహా
రంబొనర్చు చకోరములనంగ

తే. గీ. ఒకరొకరిచేత వికసనముఁబొంది యొక్క
రొకరియందున లీనమై యొక్కరొకరి
కున్నతింజూర్చి ద్యోతిల్లి యొక్కవింత
యందమిచ్చిరి వార లానందమునకు.

తే. గీ. బింగిబంగరు చాయపైఁ జెంగలించు
చిటిపొటిమొయిళ్ల చిత్రవిచిత్రరూప

సంఘటనల్లె నాశ్చర్యచకితదృష్టి
నవధరింతుము వారు సంధ్యాగమముల.

తే. గీ. అప్పుడప్పుడు వారు శాఖాశాఖాంతరాళ
నిర్గత స్వీయ శయన మందిర గవాక్ష
సన్నిహితచంద్రకిరణగుచ్ఛముల దెరలు
మినమినలఁ గ్రోలుచుందురు రసపిపాస.

చ. పొడిపిడులాడుచున్ గపురముంబలె మేల్ తెలుపుం బు
సుంగుకై
వడినెలతావియుంగలిగి పట్టువలెన్ మృదువై ఘృతంబుతో
నుడికినటుల్ నిగన్నిగలు నొప్పుచు సవ్వడుపిండు పాలఁ బో
లెడి నులివెచ్చనన్ బరిమళించెడు కుంకుమపూరసాన్నముల్.

చ. చిఱునవ్వుతోడ మెలినగిషీగలబంగరుపూలవెండిప
ళ్లెరమున నించి సుంతగదలింప ఘుమంఘుమయించు
జిహ్వపై
గరఁగెడుశాకముల్ రకరకంబులు చుట్టునమర్చి చేరపై
పొరలెడియాజ్యధారఁ బనివోవఁగ వడ్డనచేయునిచ్చలున్.

చ. అడుగులనొత్తుచున్ దములపాకుల వాకిటతేనియుం గనం
బడుగళవొత్తి సన్ననిరవంబునఁ జల్లగఁ బాటపాడి నె
య్యుఁడు సుఖనిద్రఁ జెందనొకరూరగ శయ్యబరుండియామెకే
గడపఁగ మేల్గనన్ మగనికన్నను మున్ దెలవారు
జామునన్.

ప్రకటకర దాస్యజీవన పరస్పరవైర విఘూర్ణమాన హైం
దవమతదృష్టి రేఖికలుఁ దలిర్పఁ జెచ్చుచునుఁ బ్రధానముల్.

ఉ. వర్ణవిశేషదోషపరివర్జిత దివ్యతపఃప్రభావ సం
పూర్ణ పురాతనార్యఋషిపుంగవ పుణ్యవనాంతరస్థలీ
పర్ణకుటీరవాస నిరుపద్రవ నిర్మల నిత్యజీవన
స్వర్ణయుగప్రసంగములు సల్పుచు నొక్కెడఁ గూడి యిద్దఱున్

'శారద' నుండి

## సముద్ర వర్ణనము

మ. అరుణుండేగెను - కాలపూరుషునిచే నాకాశవీథిన్ మహో
హారమర్ఘాకరదిక్సువర్ణమయసింహద్వార మూయింపఁదట్
తెలువంగాఁబడుచుండె - నింక వెడలున్ రేరాణి భూలోక సం
చరణార్థంబని ప్రోగనైలెడ నుదంచత్పుష్ప తూర్యధ్వనుల్.

మ. అలకల్ దిద్దుచు రత్నకంబళము వాయుంబొల్చు తేఁబిచ్చిరం
గలయంబాడుచుఁ, బూలతీగియలఁ బైగా సారెకే తెంచుచున్,
మెల మెల్లన్ మెయిఁ బ్రాకుచున్, నవనవోన్మేషంబు
నాటించుచున్,
పలకింపన్ బసివైరగాలి వనిలో వాహ్యాళిగావించుచున్.

మ. ఇరువంకం గలపూలపై మసుదుచున్, హేలాగతిన్ వానిపై
పారపుష్పాళ్లోక చోటనుండి యొక చోఁబొందించుచున్, బుష్పతే
నరదాంపత్యసుఖానుభూతిఁ గనుటనా సంప్రక్తమై తేనెయూ
గిరముం బారణసేయు భృంగపటలీగీతంబు లాలింపుచున్.

మ. అటులిట్టుల్ విహరించి, కొంతవడి కా యారామ కేళీసర
స్తట [illegible] నాధ్ఘవృక్ష సంతతుల చెంతం జేరి, తత్కాలసం
ఘటితాకాశ వినీల మేఘములు బంకన్ దృష్టి నారించుచుం
తటిలో శారద ప్రావృణాగని త్వరాకనూత్న వ్యక్తి నిశ్శంకతన్.

మ. ఎపుడింపొందెటికి సేగదొంటివి, కవీ! యీవత్సరంబైనఁ బ
ట్టపరీక్షన్ జయమొందుబాధ పోనగట్టించావొ? చెన్నప
ట్టపు వాసంబు సుఖప్రదంబగునె? యిష్టాగోష్ఠి నచ్చో సము
ద్రపుఁదీరంబున ముద్దుమంగళిని సంధ్యాకాలమున్ బుచ్చువే?

మ. అని ప్రశ్నింపఁగ నాతఁడేమియును మధ్యాహ్నంబునన్ జేరినాఁ
డను పట్టంబుననుండి యీవిజయవాడన్ శారదా! కీర్తి సం
చనలేకుండ లిఖించినాడను [illegible]
[illegible] దేవలితంబు వెల్వడెనొ [illegible] గర్భంబునన్.

మ. అవశిష్టంబగు 'చెన్నపట్టణ' నివాసంబునుం గూర్చి యెం
తవచింపంగఁ గడంగినన్ దనివిఁ జెందం బోదుమే! అందునన్
దావికేశంబు నిమీనమున్ పదమునుందున్ ద్రవ్యమున్ వేరివ
స్తువా కందుండిన హాయి మైఁగడవనమ్మున్ జీవితంబంతయున్.

శా. సాయంకాల సముద్రతీరకృత సంచారంబునం గల్గు స్వ
ర్గీయానందము మాఱగొంచు నవరాద్రిద్యోతమానారుణ
చ్ఛాయాకల్పిత చిత్రవర్ణయుత శశ్వత్సుప్రత్య మార్పిచ్ఛటా
గేయాకర్ణనభాగ్యముం గనని వ్యక్తిం జూడఁబో మవ్వారిన్.

శా. ఆయాపున్నమ రేల నేను ససహాధ్యాయుండనై పోయి యా
తాయాతాబ్ధితరంగ పంక్త్యపరి భాగా పూర్ణచంద్రాతప

చ్ఛాయా సుందర సుప్రసన్న మధురస్వచ్ఛందలీలా విహా
రాయత్తంబగు దృష్టి నుండును నిశీథాంతంబు పర్యంతమున్.

శా. నిండుం బున్నమ చందు వెన్నెలను వెండిన్ బిచ్చినట్లుండి యూరిం
దొంగుండౌచు తరంగడోలికలలో నుయ్యాలలూగంగఁ జం
ద్రుం డబ్ధిం బ్రతిబింబరూపమున నెంతో నేత్రపర్వంబుగా
నుండుం గన్నుల నాడు మన్న యటులే యుండున్ మదిం
బాతినన్.

మ. త్వరితాన్యోన్యతరంగఘట్టనలచేతన్ మాటికవ్వానిపై
నురుగుల్ దేఱి కదుళ్ళుగట్టి కనువిందుం గూర్పు నచ్చోటి సా
గరనీరంబున మిన్కు-మిన్కు-మను రాకాచంద్రచంద్రాతప
స్ఫురణంబుల్ దలపించినన్ బులకరించున్ దేహ మత్యంతమున్.

## 'సతీస్మృతి' నుండి

శా. నాఁడే కాదు భవద్వియోగ మిపుడైనన్ జ్ఞప్తిం బాతినన్
నాడీమండలమెల్ల బిగ్గమని మండం జొచ్చుఁ బ్రాణంబు ల
ల్లాడన్ సాగుఁ గుఠారధారఁ దలప్రక్కన్ వేసినట్లుండు నీ
లేమిన్ లోకము లస్తమించినవిధంబై తోచుఁ జిత్తంబునన్.

మ. సతియున్ దివ్యసువర్ణపక్షముల నిస్వానంబు గుర్రింప నా
యతమై నాదు మనోవిహంగ మిదె యాకాశవీథీసము
ద్గతమయ్యెన్ దురదృష్టవాతహతి భంగంబందునో, లేక సం
తత చింతావరిపాకశక్తిఁ గృశత్వంబౌనో, ప్రాణేశ్వరీ!

తే. గీ. ఎఱుఁగవిమనోవ్యథయొకాని యెంతొకాల
మటుల జ్యోతిఃప్రభలతోడ నక్షిగోళ
మేఘములఁ జూపు మెఱపులు మెఱయుమీఁద
మరణనిర్ఘాతపాతంబు జరుగకున్నె.

సీ. అధిక ప్రయాసజన్యాన్వితమందనం
దాంత్యకాలనివేదనాక్షరములు
పరివేదనాముహుర్త్పవశాన్మృధారావి
లోలశాకూతావలోకనములు
జ్వరతీవ్రతీవ్రతాజ్వరమాణహృద్యంత్ర
చరమనాడీహాతాత్ స్తంభనములు
ఇహానిరాశానిస్పృహైక సూచకముఖ
చంద్రాస్తమయతిరశ్చాలనములు

తే. గీ. వివశఘటనావిభిన్నవిభిన్నమైన
నాహృదయదర్పణమున ననంతములుగఁ
బ్రతిఫలించుచునొనరించు బ్రళయతాండ
వార్భటి భయంకరాతిభయంకరంబు.

మ. అతిశీఘ్రంబుగ నస్తమించె నొకసంధ్యాకాలపుంజర్తకుం
బ్రతిమైకన్నులవిందువైన మనదాంపత్యంబు, కానీ భవ
త్ప్రతినస్తైపారమ్యల్లనూడిపడిపోవంజేసి నీయట్లు భి
న్నత లేకుండు ననంతమందెప్పుడు లీనంబౌదునాత్మేశ్వరీ!

మ. కడుపుంజీపిము గాఢమైనయనురాగంబేకమై మాటికిన్
విడఁబ్రత్యగ్రప్రకాశంబునందుఁ బ్రతిబింబింపంగ శంతానము

స్నేహకుఁ నా మొదటదృష్టిగోళముల నివిట్టట్టులంద్రిప్పి మా
చెమ్మనీయాదరాదిమోహనమునం దక్కన్ నేటిపర్యంతమున్.

మ. మరణానంతరమందు నింకనొకజన్మం బెత్తితో! మావయిన్
మతినీకుంగలప్రేమపుంబలువలన్ మాయక్యసేయువ్వుడున్
విరుగం జొచ్చితో! లేకయామొదలితో నేనిప్పుడుందీఱితో!
వరలోకంబును జేరితో! తెలియ దో వంజాక్షమాత్మేశ్వరీ!

మ. మఱిపెంపొంబనిబిడ్డలన్ విడిచి, నీమూలంబునన్ సాగు కా
పురము ధ్వాసమొనర్చి, యాదినమునన్ బో లేక పో లేక తీ
వరమా వేదననుండియాగనలతో భావించి, యేకోరిక—నా
కెఱుంగం జేసితి వా నసమలుతనే యానాటి కాత్మేశ్వరీ!

తే. గీ. తత్తదుచితంబులైన వర్తనలవలన
బాల్యమునునుండి పెనుపంగఁబడిన యొడలె
నాకునీకిప్పుడడ్డమై నడుమ నిలిచె
నింతకన్నఁ గృతఘ్నత్వ మెందుఁ గలదొ!

శా. ఆకాలంబుగతించె, నాసుఖమదృశ్యంబయ్యె, నాప్రేమపుం
జోకల్ పోకలు దృగ్విలాసనటనల్ శూలాయమానంబులై
తాకన్ జొచ్చె, క్షణక్షణంబు హృదయాంతర్నాళికావాంబులె
ట్లాకంపించుచునున్నవో యెఱుఁగవా, హా నామనోవల్లభా!

శా. శోకాఘాతవిపర్యయస్థితిని సంశోధ్యంబుగాదో చు నీ
లోకంబందున నేమిప్రాపుకొననాలోచించనోగాని ఛా
యాకారంబుగవచ్చిమృత్యువు సమాహ్వానంబుఁగావింప న
ప్రాకంబెట్టవాడంగె నస్థిగతకాయంబెంత హేయంబొకో!

కుడిచను బాలుఁ ద్రావు పసికూనను వానియనుంగుఁదల్లి తా
నెడమకుఁ ద్రిప్పి చన్గుడువనిచ్చెడునంతటిలోన బిడ్డ మె
క్కెడుపునఁబోవ వెట్టుఁ బ్రతిప్రాణియునట్టులె యీప్రపంచమున్
విడి చరమేగునాననుమ వేదనపాలగుఁగాదె, ప్రేయసీ!

చ. నడి నాకాగమనంబు చేఁగలుగు నానాయూపపుంజీలికల్
పిదపన్ గల్పినయూనవాలయినఁ గన్పింపంగఁబోనీని సా
ఉదలంబోలి సమష్టిలోఁబాడము వేఱుంబాటులన్ దిద్దియా
కృదకృ సంస్కృతినిర్వహించితివి లోకంబెన్న నాత్మేశ్వరీ!

తే. ఆడుకొనునీడున వివాహ మాడినాము
కౌమరుఁ బ్రాయంబునం గవగూడినాము
విహారానందమును చూఱలాడినాము
విధివశంబున నీనాఁడువీడినాము.

తే. సరళముఁ బ్రశాంతమును సుప్రసాదమధుర
తరమైన నాటిజీవితాచరణమెల్లఁ
బరమవిస్పృమాజేఁ బటాపంచలయ్యె
క్షారసమ్మిశ్రితంబైన క్షీరమట్లు.

తే. కలువనో! శోక చక్రవాకమునో! గాక
కటకటా! మానవుఁడనైన కారణమునఁ
బవలులున్ రేలు నేనొక్కపగిదిగాఁగఁ
గ్రాగవలసెను నీవియోగవ్యథాగ్ని.

తే. పదపదవినిస్రుతంబగు ప్రాణధార
దినదినము నాకు నవనవోత్తేజమొసఁగఁ
బలుకరించెదు నాప్రాణపదము లేని
పాడులోకాన నేనేల బ్రదుకవలయు.

తే. గీ. అడుగుటయనంగ నుడువుటయనఁ జరాకు,
అడుగడుగునందు బ్రహ్మాండమగు పరాకు,
నాకు దుష్ప్రాపకంబగులోకమునకు
నేమిసంబంధమో ! ఉండుటెందుకొరకొ !

చ. అది మనమారహస్యనిలయంబుననుండి పరస్పరంబుగా
హృదయము లంకితంబులొనరించినపుణ్యదినమ్ము, నాటి నీ
మృదుతరముగ్ధమోహనశరీరముఁ, జల్లనినీగులాబిపూఁ
బెదవులమీఁదిలేనగవువెన్నెలవన్నెలఁ జూచునెల్లెడన్.

చ. ఎదురుగనుండియొక్కయెడ నిద్వరమున్ బెదవుల్ చలింపఁజే
మదిమదిమాటలాడ మనమధ్యనెమధ్యన చూపుచూపుతం
బడిలపడంగ నాడుగడుపంబడియుండినపుణ్యకాలమే
మెదలెడికన్నులందెపుడు మేల్పొనికన్ నిమురించుచుండినన్.

చ. మెలినిదుగొన్నపాదముల మెత్తదయిన్ నగమొత్తిగిల్లి చె
క్కిలి యడచేతమోపి కనుగీటుననే కడునీటు జూపి న
వ్వలయఁగఁజేసిన న్వలచియున్ వలపించినయట్టి నాటియా
పాలకువవాటినంతన బివ్వరుక్కమమున్ హృదయంబు
సర్వమున్.

మ. ఒడియుండుండినయట్టి మల్లెపువులందొక్కొక్కటే గాదిసిగా
లైడయల్లించుకొనంగఁ దల్లికిడు వేళన్ వచ్చు నన్ గాంచి వె
ల్వడగా నిల్వఁగ బాఱువోక మునిగాళ్ళన్ నిల్చునా నాటికి
పడుచుం బ్రాయపుఁ జిన్నినాకనులకున్ బ్రత్యక్షమౌగాపురన్.

చ. మనసులు మాటలుం గ్రియలు మర్మము లేకముఖంబుగాఁగ వి
చ్చనిమనకోరికల్ విసవిసన్ మసలన్ మును చూచు
గొన్న త్రీ
యుని సుఖపారణంబు హృదయప్రతిబింబితమయ్యె దర్పణం
బునఁ బ్రతిబింబితంబయిన మోహనదివ్యధనంబు చూడ్పునన్.

తే. గీ. సహజకోమలమైన పుష్పంబెగాక
కఠినశిలయోని యందమై ప్రాలునట్లు
హాసమేగాక నీయాగ్రహంబుసైత
మమృతధారాభిషేచనం బాచరించె.



తే. గీ. ఎదనెదం గదియించుచు నిమిడియిమిడి
యొకరికౌఁగిటనొకర మట్లున్న నాటి
ప్రణయబంధంబు నాకునిప్పటికి కాదు
మఱుపునకు రాదు వేయిజన్మములకైన.

తే. గీ. ఒకటనేకాంతమునయుండి యొకరినొకర
మతిమృదులమైన పరిహాస మాడుకొనుచు
లోతెఱుంగని నవ్వులలోన మునిగి
తేలుటానాటితోడనే తీఱిపోయె.

సీ. ఉదయంబునుండియొక్కొక మహాయుగముగా
గడియయుంగబె తిరుగంబడంగ
మధ్యాహ్నమై సూర్యమండలం బటువ్రాలఁ
జాపుచో హృదయ ముప్పొంగిపోవ
వికచపుష్పము నభోవీథిగా నీసఖ్య
ముగరె నాప్రాణ మున్మత్తముగాఁగ
ఎల్లర క్షుద్రవాహికలు నీక్రేవకే
నసుఁగొనిపోవుశేవను వహించ

తే. గీ. వవలువవలెఁబ్రణయవిశ్వాసభరము
లైననిశ్వాసములతోడ నల్లనాఁడు
నలిపియుండిన యానానిశానిరీక్ష
ఇపుడు నాప్రేమ కగ్నిపరీక్షయయ్యెం

తే. గీ. కెలనికిం జేరి కేలికింగేలుసేర్చి
సృష్టిగూరిచి నివొనరించునాటి
సరసచర్చాపటీరచర్చామచర్చి
ఆత్మకు దహద్దహద్దహానార్చి యయ్యెం

సీ. జటరెండుగమాత్రముండి మోమున నాతి
యాఱనిచెమట ముత్యాలతోడ
నాకకొన్ని చిఱుతగాలికి రేగఁ దడినంటు
కొనకొన్ని చిన్నిముంగురులతోడఁ

తడిపొడిపారిజాతపువన్నె రైకపై
వన్నిటిపువ్వువన్నె పైటతోడ
అడుగుదమ్ములమీఁది కఱజాఱు చీరకు
చిట్లడిద్దెడిచివుర్ వ్రేళ్ళతోడ

తే. గీ. పడిపడిగనాఁడు దొలకరివానలోనఁ
బఱుగిడుచు నింటిలో జొరంబడినయట్టి
నీమధురరూపరేఖ కన్పించినట్లె
తలఁచి మది యిప్డు దూరక తత్తరించు.

సీ. సన్నజాజులసువాసనతోడి చినుకుము
త్యాలతొలకరిజల్లుగాలికన్నఁ
పడమకినుండి వెల్వడుతావిరివిలోఁ
దేలియాడెడి పైరగాలికన్న
గోవజవ్వాదిభుగ్గురుభుగ్గురులతోడఁ
గలిసిపోయిన వలిగాలికన్నఁ
బచ్చగోరంటపువ్వు పరిమళంబుతో
జతగొన్న పులయమారుతముకన్న

తే.గీ. మధురమధురంబు, మంజులమంజులంబు,
ముగ్ధముగ్ధంబు, మోహనమోహనంబు,
నీసురభిళాతిమృదులనిశ్వాసపవన
మకట చ్ఛాయామయస్వప్నమయ్యెనేఁడు.

సీ. కెరటకుంజరముల నొడ్డున సముద్రంబు ని
ర్జించుచుండెడునట్టి నెట్లనూడిఁ
విసరి గాలిదుమార మిసుకతిన్నియలయం
దున సమర్పుచునుండు నొక్కలట్టి
లోకవిధంబగుమీనునొదలిపై మిలమిలగ
మెఱసిపోయెడునట్టి పోరలకరణి
నపుడప్పు డాకసంబందుఁదోచు నలంతి
యలఁతిమబ్బులలోని యఱలపోలిఁ

తే. గీ. గనులు రెండైనఁ జూపు నొక్కటిగఁ జేసి
హృదయముఁ గఱచుచుండు నీయుదరవళుల
వంటనుంచిప నీవింతనంత నొడుగు
కృత్యమునకును నాకును దీఱ ఋణము.

సీ. కమఁజిన్నిమబ్బు లొక్కటియు నొక్కటిగూడి
యపుడప్పుడే యవలవలఁ జనుట
గాంచుచుండలి యవరంజచాయలు వోయి
కటికచీకటి దెసల్ గ్రమ్ముకొనుట
మినుకుమినుకను నరంబున మింటితారకల్
నను జూచి ముసిముసినవ్వ నవుట
అల్లనల్లనఁ బ్రభాతాయాతవాయువుల్
చెవిచెంత గుజగుజల్ సేయుచుంట

తే. గీ. కనుగొనుకొలంది మనవిరాగంబెగాక,
నాప్రకృతజీవితమును లోకప్రకృతియు

నాసహోదరమిత్రానునయములెల్ల
నుల్లమునఁ దట్టు నచ్చుపం దొత్తినట్లు !

తే. గీ. చితిపయిం బెట్టి నిన్ను భస్మీకరించు
ఘోరదృశ్యంబు నాజీవకోశమందె
జీవితేశ్వరి ! యిఁకనెంత శీఘ్రగతిని
చేరవత్తునో నీవె వీక్షింపుగాత !

## 'రామాయణము' నుండి

సీ. అది చిన్నచిన్నముత్యాలు ముత్యాలుగా
సెలయేటిలోనీరు చిలుకుచోటు
ఆచిన్ని నీటిముత్యము ముత్యమును ముద్దు
లొలుకు నాసమయ మర్కోదయంబు
ఆస్వర్ణసూర్యోదయంబు పర్వతపర్వ
తాంతరాంతరభూరుహాంచలముల
నాయంచలములపై నాడు నాయారుణ్య
మహహా! యెంతటిహ్లాదసంగమంబు!

తే. గీ. ఆయకృత్రిమరామణీయకవినూత్న
రత్నకాంతిప్రవాహనీరాజనమున
రాజిలుచునున్న యతఁడె శ్రీరామమూర్తి
జలధరశ్యామసుందరచక్రవర్తి !

సీ. ఆవిశ్వమోహనం బగు పరబ్రహ్మంబె
జానకీహృదయపంజరశుకంబు
ఆపరంజ్యోతియే యల్లరాఘవపర
బ్రహ్మకేవనసుప్రభాతగీతి
పతిరాఘవుండెట్లు ప్రత్యక్షమైనట్టి
జనకునిపూర్వపూజాఫలంబొ
సతిజానకియునట్లె జనకరాజమహర్షి
శాంతిభూమీరుహచ్ఛాయ యయ్యెఁ

తే. గీ. పురుషులం దట్టి శ్యామసుందరునిఁగాని
స్త్రీలయం దట్టి సౌందర్యతిలకఁగాని
పతిసతుల నట్టి పుణ్యదంపతులఁగాని
కనివిని యెఱుంగ మెందు నేకాలమందు.

సీ. మాణిక్యముగ విశ్వమాతృగర్భమునుండి
యావిర్భవిలిన ప్రత్యక్షలక్ష్మి
చందనాంకురముగా జనకరాజమహర్షి
సాకికొన్నట్టి కన్యాకుమారి
జాజితీవగ రామచంద్రమందారంబు
నాశ్రయించిన తదాయత్తచిత్త
తోడునీడగ భర్తతో ఘోరకాంతార
మనుగమించిన ప్రణయప్రపూర్ణ

తే. గీ. ధరణిజనయిత్రి తరుసహోదరులు లోనంగ
కేసురుంగుంకుమము నారచీరదాల్చి

చూచితే! సీత చక్కనిచుక్కలీల
నెటులనిల్చెనో తనజీవితేశుప్రోల!

సీ. పరిసినంతగఁ బ్రాణవాయు వాఘ్రాణింపఁ
పారణంబొనరింప ఫలరసంబు
తీర్థమాడంగ నదీప్రవాహజలంబు
వస్త్రంబుగ ధరింప వల్కలంబు
జపతపంబులఁదీర్ప సాంద్రవృక్షచ్ఛాయ
అట నధిష్ఠింపఁ గృష్ణాజినంబు
ఆనందమొంద నాత్మానుసంధానంబు
విశ్రమింప స్వయంకృతాశ్రమంబు

తే. గీ. పవ్వళింపంగఁ బచ్చికప్రంపుటనఁటి
యాకుఁబాకను లేఁజివురాకుఁబాన్పు
కలదె! లక్ష్మణ! స్వర్గలోకముననైనఁ
పావనం బీమహారణ్యజీవనంబు.

సీ. పఱచినరత్నకంబళము లట్లలరారు
సెలయేటిగట్ల పచ్చికబయళ్ళు
గోగణంబుల మేపుకొనుచు నాలాపించు
విప్రబాలుర సామవేదగీతి
ప్రతిఋషీశ్వర కుటీరంబు వెల్వడివచ్చు
వైశ్వదేవసుగంధవాయులహరి
ఫలభారమూని చూపఱకు నమ్రత్వంబు
బోధింప వ్రాలిన భూరుహములు

తే. గీ. ఆశ్రమమహీరుహంబుల కవలియవలి
యపరసంధ్యాసువర్ణ సూర్యాస్తమయము
నామహీరుహామందమందానిలముల
హాయి యలవడు నెంతపుణ్యమున వత్స!

సీ. ఫలవృక్షముల మధ్యభాగమం దొక్కొక్క
యతికి నొక్కొక్క పుణ్యాశ్రమంబు
ఆశ్రమాశ్రమమునం దఖిలవిద్యాబోధ
కొఱకునై యొక్కొక్క గురుకులంబు
గురుకులంబులఁ జుట్టుకొని దున్నకుండ నీ
వారంబుపండు కేదారకములు
కేదారకములలోఁ గ్రిందరాలినయట్టి
గొలుచు భక్షించు శకుంతకోటి

తే. గీ. ప్రతిశకుంతము సాయంప్రభాతములను
దినదినముఁ బాడుతీయని తేనగీతి
గీతిగీతియు శబ్దించుగిరులదరుల
రమ్యగంభీర మిమ్మహారణ్యభూమి.

ఒక కన్య

ఉ. పాదరదు సిగ్గుచిన్న యొకచిన్నకుమార్తె, నునుమేను
పూచి పూ
యదు తొలిజవ్వనంపుఁబదియాఱవవన్నె వసించిపూఁత, ని
ల్వదు చిత్రరాకమోవి సవిలాసముగా దరహాసలక్ష్మిఁ, నిం
పదు మాటినిండి యింకఁ బదునాల్గవవత్సరమేని లీలకుఁగా.

ఈ. పాదము మునంతలోనడఁగిపోవును పొంగియుఁ బొంగకుండు లే
మొదదను దోరకోరిక లనేకము లప్పటికప్పు డిప్పుడి
ప్పాడె యుదయంబునుండి విడిపోవుచుఁ బోవుచునుండు
మంచుక్రొ
వడి మనలీల బాల్య మెడఁబాయుచుఁ బాయుచునుండె
దేహమా.

ఉ. పాలవరేణ ప్రవర్తిలెడి బాల్యము వచ్చునికోరిఁ జేసి పా
జాలును పొంగి తోడుకొనఁ బోవుచునున్నది నేఁడు కేలవుం
జాలను తక్రధార నిఁక జల్లఁగఁ జేతుడుజవ్వనంపు మే
త్మాలినిగారవుందఱికమీఁగడ మెవ్వనికిన్ లభించునో !

## ఒక సాధ్వి

ఉ. ఆణిముత్తెంగుము త్రియము లాత్మజులెల్లరు గూడ, నీవిహాః
ప్రాణము ప్రాణవల్లభుఁడు ప్రాజ్ఞశిరోమణి దీనబాంధవ
త్రాణపరాయణుండు మధురస్మితపూర్వకభాషి యున్నదా
ద్యానమనోజ్ఞకల్పకము, ధన్యవు పుణ్యవతీసతీమణీ !

ఉ. నీ వెఱుఁగంగ లేవు జననీ! భవదక్షులనుండి వచ్చు నా
పావనశీతలామృత శుభప్రభచే ద్విగుణీకృతప్రభన్
నీవిభుజీవజీవమణి నిత్యము హర్షకళం గలుంగు మ
న్నీవుల లేమిచీకటులఁ జిమ్మును పుణ్యవతీసతీమణీ.

ఉ. ఏమనివచ్చుమట్టముకో మిత్రునిరో యొకపూట నింట గం
గామృతమిచ్చునంతకె బయల్పడుచుందుము దీనబాంధవ
స్తోమము రాకకై యెదురుచూచెద రీరలు తల్లిదండ్రులే
నోములునోచి మిమ్ములఁగనుంగొనిరో కడుపుణ్యదంపతుల్.

ఒ క శి శు వు

సీ. ఊరెండలోని పన్నీరపుష్పముకన్న
దివ్యమైన శరీరదీప్తినొసఁగి
పండువెన్నెలలోని ప్రసవాసముకన్నఁ
జల్లనైన వచఃప్రచార మొసఁగి
వియదభ్రములలోని విద్యుల్లతలకన్న
సొబగైన చుఱుకువాల్చూపు లొసఁగి
మాలతీవనిలోని మలయానిలముకన్న
వాసించునంత పేర్వాసి యొసఁగి

తే. గీ. చిరతరాయుష్యమొసఁగి ప్రాచీనహైంద
వార్యఋషికులసంప్రదాయానుకూల
జీవనసుఖం బొసంగి సుశ్రీ యొసంగి
బాలు రక్షించుగావుత ప్రకృతిమాత.

సీ. మహితసాధ్వీమణీమాణిక్యదర్పణ
స్వచ్ఛమానసవృత్తి స్తన్యమిచ్చి
విశ్వవిశ్వంభరావీరవీరాంగనా
నిర్నిద్రచరితల నిద్రబుచ్చి

భరతధాత్రీశ్వరీవరసుమంగళగీతి
కాళీరవంబుచే మేలుకొలిపి
ప్రాక్తనార్షమతప్రవృత్తినామోచ్చార
ణంబుచే నుచ్చారణంబు గఱపి

తే. గీ. సహజమగుప్రేమ నమృతహస్తములచేతఁ
బెనుచుకొనుఁ డింక మాధవపెద్దివంశ
మౌక్తికంబైన మాయీకుమారుఁ బాలు
నన్నపూర్ణాహనుమదాఖ్యాతులార !

సీ. ఆకొన్నయపుడు నీవారగించెడునట్టి
మాతృదుగ్ధముకన్న మధురమగుచు
కడుపునిండినమీఁదఁ గనులమీఁదికివచ్చు
నిదురకన్నను జాల మృదులమగుచు
నిదురమేల్కొనగ సందిటఁబట్టి యాడించు
జననిహస్తముకన్నఁ జలువయగుచు
ఆడించునప్పుడు నీయలఁతిబుగ్గల నిల్చు
నెలనవ్వుకన్న నిష్కలుషమగుచు

తే. గీ. జిలుగుఁజలుగుంబలుకు నీదుచిన్నిమోవి
చిగురునందుండి వెలికి విచ్చేయు టెంత
నెపుడెపుడో యంచు బంధుల మెల్లవార
మెదురెదురుచూచుచుంటి మోయీకుమార !

## కవి

ఉ. జీవులనెల్ల దేవుఁడె సృజించెనొ నీవె సృజించియుంటివో
దేవునిఁ దద్రహస్యమెటు తెలదుగాని యిదేమి న్యాయమో
యీ! వచియింపుచుంటివి కవీ! పదునాలుగుగా జగంబు లె
ట్లీవొకయుండవే యెఱిఁగి తెందుల కిట్టియభూతకల్పనల్.

చ. ఇలఁగల యెల్లమంచితనమే పరమేశ్వరుఁడన్న దానిచేఁ
గలుగుసుఖంబె స్వర్గ మది కానిదియే నరకంబు ప్రాణముల్
వెడలకపూర్వమే యనుభవించును వానిని జీవి భూమిలోఁ
గలిసినమీఁద స్వర్గనరకంబులు జీవి కెటుల్ ఘటిల్లెడున్.

ఉ. మేమును నీవు మానవులమే గద! యొక్కఁడవీవు మాత్రమే
భూమిని వీడి పైకెగిరిపోవవుగా! యొక వేళఁబోవ నీ
భూమికి రావుగా తిరిగి బూటకముల్ వచియించి యింతహం
గామయొనర్ప నేమియసిఘాతము పైఁబడనీకునో కవీ.

మ. పరలోకంబున దైవమున్న దను విశ్వాసంబుఁబోఁదోలి యీ
నరుఁడే దైవమటంచుఁ దోడినరులన్ నమ్మించి దైవంబు నే
నరసంతానమొనర్చినావు కదరా రామాయణంబందు నీ
చరితంబింతయునుం జిదంబరరహస్యంబాయె నోయీ కవీ!

శా. ఆదిన్ బింబమై నరప్రకృతిలో నామీఁద శబ్దార్థమ
ర్యాదన్ వర్తిలి తన్నరప్రకృతినే యంతర్ద్వమేవాహమై
యాదైవంబు క్రమంబుగాఁ బ్రకృతిపాదాక్రాంతమైపోయె నీ
సోదర్యుండగుమానవున్ బ్రకృతిరాజుం జేయు మోయీ కవీ!

# సంజయరాయబారము నుండి

## ధర్మజునకు ధృతరాష్ట్రుని సందేశము

మ. తనయుల్ గానా యెడభక్తియుంచునొకయంధత్వంబు ప్రాపించినా
జనుషాంధత్వము నేగణింపక కులాచారంబు శాస్త్రంబు నా
త్మని రాజ్యార్హత గట్టిపెట్ట నది నైవర్ రానిదే యయ్యెఁ ద
ప్పనిదై వోపమునా కుసోదరుని నిర్బంధంబె ముంచెన్ ననున్.

మ. వెనుకన్ ముందును జూడఁజూడ కిటు గావింపంగ వద్దంచు నె
త్తిని నొక్కొట్టుక చెప్పి చెప్పి విసువెత్తెన్ నాకుఁ దానేమి సుం
చిన కాలంబును వెళ్ళదీసికొనియెన్ చేసేతులం దెచ్చిపె
ట్టిన రాజ్యార్హతయున్నదే యెసరువెట్టెన్ గొంప కీనాటికిన్.

విదకద్దానినపట్టి యెల్లపుడు తా వ్రేలాడుచున్నాఁడు నా
కొడుకా కొమ్ములు దెచ్చిపెట్టినది మీకున్ దండ్రియున్ నాకుఁ ద
మ్ముఁడునై యుండిన పాండురాజెయను మోమోటంబు కేనైన నే
నడిరాకుండఁ గులంబుగావ మనదే సర్వంబు భారంబికన్.

ఎటులీవిచ్చితి నర్ధరాజ్యమును నాదే కాదె రాజ్యం బెటో
యటు లేపుణ్యముచేతనో తిరిగి సంప్రాప్తించినన్ మానవి
ష్పటికా మాధ్యము వాడిసూది మొన మోపంబడ్డ మాత్రంబె యి
చ్చుట కేనొల్లనటంచు మాటికెదిరించున్ బల్కు నీరీతిగన్.

మ. ఈయువరాజై కొడుకుండ రాజనగ నేదో నామమాత్రంబె పౌ
రవవంశీయులయానుపూర్వక చరిత్రంబట్టి యేకాలమం
దెవరుం గా రాజ్యము పాలుపంచుకొనినట్లే లేదు చట్టాలనా
వ్యవహారంబౌర పెద్దవారలకుటుంబంబందె వర్తించెడిన్.

శా. నీకాసీతిసనంక్రమించినది కాని గ్రుడ్డివాడౌటచే
నీకుం గా మారుగ రాజ్యమేలవలసెన్ నీతమ్ముఁడా నేడు నీ
దేకాదే? యధికారమంతయును నట్లే కానిచో నేను రా
జే కాకుండు నిఁక నీలపాండవులకై యేభాగమీయంగావలెన్.

---



Bharathi Press, Tenali. P. I. C. 36. 25—9—45—2000